శ్రీరస్తు.

# భోజసుతాపరిణయము

అను మహాప్రబంధము.



ఇది

శ్రీమన్మదనగోపాలశాస్త్రికటాక్షవీక్షణావాప్తచతురతరసాహితీవైభవ

చక్రపామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల

మార్గణవిశ్రాణిత మహాశ్వల కోవిదనుతభాగధేయ

## కోటీశ్వరనామధేయ

ప్రణీతము.



ఈ పుస్తకము

శ్రీ "వైజయంతీ" ముద్రాక్షరశాలయందు

ముద్రితమును, ప్రకటితంబు.

1909



[Price [illegible] annas.

# PREFATORY NOTE.

In passing this book through the Press I have taken the liberty of removing some verses and altering others in order to satisfy the demands of modern taste as regards descriptions of feminine charms &c. This I did under the direction of my father the late Rai Bahadur [illegible] Charlu who always held that in publishing an old book written by an author of a by-gone age it is the duty of the publisher to see that it suits the taste of the reader before whom it is placed.

I am sorry I have not been able to procure any information about the author beyond what our veteran scholar Rai Bahadur K. Veerasalingam Pantulu has given in his ' Lives of Poets. '

In this book the reader will find a number of stanzas [illegible] on the lines of the eminent poets of Krishna Deva Rayalu's days. I shall just cite one of them.

ఉ. నెక్కొనఁ గాన్వయద్యుతిఁ జెందఁ గొంత కారా ◆ జీవంబు తెంతే వన
స్థలి నిప్పులో తప మాచరింప నిజము ◆ త్రక్కెను హంసపంక్తిఁ
జలజం బందెఁ బదాత్మతి న్విధుఁ డజ ◆ స్రంబుం గళంకాప్తిఁ దా
త్పల మొందం గనఁ డయ్యెఁ గాన వదినో ◆ తన్మైత్రరమాలం బిలన్.

This is clearly on the lines of the following stanza in [illegible]

మం. నతిరమాంబుదప్రతి బెంద బూని నజాను ◆ [illegible]నోదక్రియా
[illegible] కాదోలవపూరితో వరము [illegible] ◆ రంభోభహ స్తంబులు
న్నతజిత్ విడె మరుద్విభూతిఁ గదలిన్ ◆ ద్వస్త్రీష మాచంచలో
న్నతశుండాతతిఁ బాయ నయ్యె నదిపో ◆ త్రిస్త్రరమూలం బిలన్.

P. SREENIVASA CHARLU

Lakeside, Kilpauk,
Madras,
*23rd September 1909.*

శ్రీరస్తు.

# భోజసుతాపరిణయము.

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీవాణీకరచామరద్వయరుచుల్ ◆ చెన్నొందునత్తఱి స్ఫుర
ల్లావణ్యాఖ్యపయోధివీచికలలీ ◆ లన్ జాలరాణింపఁగా
శ్రీవాంకస్థలభద్రపీఠవసతిన్ ◆ సౌఖ్యోన్నతిన్ గాంచు నా
ర్యావామాక్షియొసంగుమాకతులవి ◆ శ్వైశ్వర్యసత్కీర్తులన్. ౧.

ఉ. ఎలిమిలరాదకన్నియవి ◆ వాహమహోత్సవవేళఁ జాలన
ర్తిలిఁదలఁబ్రాలుపోసెడుత ◆ తిన్నిజమస్తమ్ము గాంకలగ్నమై
విలసిలుతేడితన్ముఖన ◆ సీవవిధుంగనిచెంగలింపన
క్కలికికలంగనవ్వుకెజ ◆ కంపుఁడు మాకభీష్టమిచ్చుతన్. ౨.

మ. పరపుంభావకళానిమోఘీనరణీ ◆ వామాక్షిక్రీడించియం
తరతిశ్రాంతినిఁబ్రాలవక్షమునఁద ◆ ద్గాత్రచ్ఛవిస్ఫూర్తిమే
దురమైనెమ్మెయియందునిండవిలస ◆ ద్దూర్వాంకురగ్రాహియౌ
హరినీలంబనఁబొల్చుకృష్ణుఁడు మదీ ◆ యాభీష్టమిచ్చుంగృపన్. ౩.

మ. తతబాహాపురుహూతరత్నరుచిర ◆ స్తంభస్ఫురత్కౌస్తుభ
ద్యుతిసంతానవితానహారలతికా ◆ ప్రోద్యత్సుమస్నిగ్ధమా
పతివక్షంబునఁబొందిరంజిలురమా ◆ పంకేజపత్రాక్షిమా
కతులైశ్వర్యములిచ్చుఁగావుతదయా ◆ వ్యాపారపారీణతన్. ౪.

ఉ. అలిగినభారతీసతిని ◆ జాంఘ్రములపైనిటలంబుఁజేర్చిమం
దలవకుయావకాంకములు ◆ హల్లకసాయకసాయకక్షతా
కలనముగాఁదలంచిదయఁ ◆ గౌఁగిటఁజేర్చుచు సంతసిల్లున
జ్జలరుహసూతిమాకొసఁగు ◆ సమ్మతభూతిచిరాయురున్నతుల్. ౫.

చ. పలువగవీణెమీటుతఱిఁ ◆ బాణిపయోరుహరత్ననిస్ఫుర
ద్వలయమయూఖముల్ కలయఁ ◆ బర్వఁబ్రవాళముపైఁబ్రవాళముల్

నలువుగ నవ్వోఁ చెమ్మేలనుచు ◆ నాథునకైనర్వ్వగఁ బల్కునవ్వన
ప్పలుకులకుల్కులాఁడినను ◆ భవ్యకవిత్వసరణిఁ జేయుతన్. ౬.

మ. రదఘాతోత్థితరాజతాచలరజో ◆ వ్రాతంబునిం దారకా
ఘుదియై దిక్కులఁ బిక్కటిల్లఁ దనకో ◆ ష్ముంజిమ్ములన్ వీడు పె
ల్లదివిజారాజంబుదుఁ డై వెలుంగనుదరీ ◆ లావప్రఖేలారతిన్
ముదముం గాంచు మకరీంద్రవక్త్రుఁ డుశుభం ◆ బుల్లాసఁ గావించుతన్. ౭.

మ. హరినాభిన్ జన్మించు మనబ్జజుఁడు బా ◆ ల్యక్రీడనాసక్తిబం
ధురభోగాగ్రవిరత్నరత్నరుచిసం ◆ దోహైకవాంఛాస్థితి
ద్వరణోద్యుక్తతచేరచించిచనఘణా ◆ వ్యాసక్తపద్మాగ్రగా
భరణశ్రీరహిఁ జెందు శేషుఁడు వచః ◆ ప్రాగల్భ్యమిచ్చుం గృపన్. ౮.

క. ఏమునివదనసుధాబ్ధి, శ్రీరామాయణసుధ జనించి ◆ నానాకథక
ప్రేమాస్పదమై వనరెడు, నామునిహృతజనతమస్త్రి ◆ దామునిఁ గొలుతున్. ౯.

ఉ. సారపయోధరప్రకర ◆ సాంద్రతనుద్యుతి బాలుఁ బల్లవి
స్ఫారజటావిశాలున్నగ ◆ సర్మకస్మితచేలు బ్రాగ్వచో
వారిధియానపాత్రుసుర ◆ వందితదివ్యచరిత్రు నాత్మవి
ద్యారమణీవిశేయునన ◆ పాయునిసాత్యవతేయుఁ గొల్చెదన్. ౧౦.

సీ. ఉపమానకల్పనా ◆ నుపమానచాతురీ, ఘనమనీషోల్లాసుఁ ◆ గాళిదాసు
లలితపదన్యాస ◆ కలితప్రబంధైక, తానతాంకకవితా ◆ దండిపండి
సారవాగమితార్థ ◆ గౌరవాధారతా, రవికుచిసాంద్రుభా ◆ రవికవీంద్రు
నకలార్థకల్పనా ◆ వికలాంతసాహితీ, శ్లాఘనీయరసైక ◆ మేఘుమాఘు
నంధ్రకవితామహాచార్యు ◆ నన్నపార్యు, సుకవిజనసంస్తుతిక రాజి ◆ సోమయాజి
నఖిలభువనజనశ్లేషి నె ◆ జ్ఞానమనీషి, నెంతుఁ బ్రార్థింతు సేవింతు ◆ హితముఁ గాంతు.

క. మేధావిలాసనంభృతి, మాధవపర్యంకభోగి ◆ మండవసమరూ
పాధునికకవివరేణ్యుల, సాధువచోనియతిఁ దలఁచి ◆ సన్నుతి సేతున్. ౧౧.

తే. సత్కవిశ్వాసవెదుగంగఁ ◆ జాలకవలఁ, జెందుకూంతలెకూయుచు ◆ జెనఁటి మొఱకు
మస్తకరిభంభవిదళనో ◆ ద్వృత్తహరిని, మొనయు లెకను గుక్కలు ◆ మొఱుగునటుల.

వ. అని యిప్పవిధంబున నిష్టదేవతావందనరూపమంగళాచరణంబును, బురాతనకవిజనానుసరణంబును, నిదానీంతనకవిపురస్కృతియును, గుకవితిరస్కృతియునుం గావించి

యే నొకకృతిని నిర్మింపం గోరి మురారిహృదయప్రసాదంబు నభిలషించి యున్నతటి
నొక్కపుణ్యరాత్రంబునఁ బ్రభాతసమయంబున. ౧౫.

మహాస్రగ్ధర. చరణానమ్రామర్త్యాంధ ◆ స్ఫురమకుటతటా ◆ సక్తముక్తాఫలాళీ
పరితోంచద్బుద్బుదాళి ◆ ప్రచురపదయుగ ◆ స్ఫారగంగాంబుధారా
పరిపూతానేకలోక ◆ ప్రకటితసుభగం ◆ భావుకాఖ్యావసమాఖ్యా
భరణశ్రీభ్రాజిష్ణుఁ డైనా ◆ ప్పుడు మ నెదుటఁగ ◆ న్పట్టెశ్రీకృష్ణుఁ డంతన్.

క. కనుపట్టినయాతనిపద, వనజంబులకు శిరముసోఁక ◆ వసుధాస్థలిపై
వినయమున మ్రొక్కిమిక్కిలి, వినియతమతి నగుచు నన్న ◆ వించితి నిటులన్. ౧౬.

భుజంగప్రయాతము. అరిస్ఫారశంఖ్యాఢ్య ◆ హస్తారవిందా
సరోజాలయాస్యాబ్జ ◆ చంచన్మిళిందా
శిరోసారనిర్భిన్న ◆ చండారిబృందా
చరాజంగమాజస్ర ◆ సంపూర్ణతుందా. ౧౭.

సీ. సనకాదిమునిమనో ◆ జలజనిత్యనివాస, కమనీయతరదివ్య ◆ కనకవాస
దానవాద్రిశదం ◆ తావళీహర్యక్ష, శ్రీపదలాక్షావి ◆ చిత్రవక్ష
ప్రజయావతానానాం ◆ బుజలోలమదభృంగ, కారుణ్యరసపూరి ◆ కనదపాంగ
నానాత్వనుతీత ◆ నైజసంపిద్రూప, రమతిలాసజ్జిత ◆ శార్ఙ్గచాప
వినతజనబృందమందార ◆ వేదసార, వివిధభువనాననాధార ◆ భవవిదూర
నీలరుచిపాత్రకళేబము ◆ స్మేరజైత్ర, కోకరిపుమిత్రనేత్రర ◆ మాకళత్ర. ౧౮.

క. అనియిట్లు సన్నుతించిన, ననుఁగనుఁగొనియాతఁడుఘనాఘ ◆ నాఘనగర్జా
జనితగభీరస్వరమునఁ, గనుఁగొనలదయారసంబు ◆ గడలుకొనంగన్. ౧౯.

పంచచామరము. తిరంబుగా భవన్ముఖాబ్జ ◆ దివ్యసద్మనవ్యవా
గ్ఝరీమరందసారధార ◆ సమ్మదంబొనర్పఁగాఁ
గరంబు నీవొనర్చునవ్య ◆ కావ్యభవ్యమంజరిన్
ధరింపఁగోరి నారమాంకి ◆ తంబొనర్పుమా పయిన్. ౨౦.

క. దీనన్ మేలగునీకని, యానళినదళాయతాక్షుఁ ◆ డంతర్హితిఁ గాన్
నేను నుగ్రక్కునమేల్కని, మానసమాశ్చర్యజలధి ◆ మగ్నముగాఁగన్. ౨౧.

తే. బ్రహ్మరుద్రాదులకు నేనిఁ ◆ బడయరాని, విభునియలదివ్యమంగళ ◆ విగ్రహంబు
భళిరనాదృష్టిపథమున ◆ నిలిచెననిన, నెంచు నాభాగ్యమహిమకు ◆ నీడుగలదె. ౨౨.

తే. సారతరతత్త్వపారస ♦ ధారవార, ఘనతనాశేముషీలత ♦ కందళించి
బుధనుతవచోవిలాసమున్ ♦ బూలుపూయు, దానఁదానిఁబూజింపఁ ♦ దగవకాదె.

వ. అని నిశ్చయించి యేనును హర్షతరంగితం బగునంతరంగంబున సహస్యఖోచితకృత్యమ్ములు నిర్వర్తించి వివిధసద్గుణసమన్వితుండును విద్వజ్జనపరివృతుండును మహితవిజ్ఞానజనకుండును మదీయజనకుండును నగుచక్రపాణామాత్యునిసమీపంబునకుం జని సముచితప్రకారంబున నతనిచరణారవిందంబులకు వందనం బాచరించి యరవిందలోచనుండు సన్నిధి యొసఁగి, యానతిచ్చినతెఱం గాకర్ణించిన నమ్మహానుభావుండును నద్భుతరసమ్ము గ్రమ్ముకొనుహృదయమ్మున తనసమీపమ్మున నున్నవిద్వజ్జనమ్ముల నుపలక్షించిన వారును గుతూహలంబున నన్నుం గనుంగొని యిట్లనిరి. ౨౪.

సీ. వెన్నపొక్కిటిదమ్మి ♦ గన్నవేలుపుఱేఁడు, తెలిపుల్గువయ్యాళి ♦ సలుపువాఁడు
బయకారిజడదారి ♦ పాపనిగనువాఁడు, పల్కుచిల్కలకొల్కి ♦ పాలివాఁడు
చౌపంచకూపుల ♦ సైసోడుగలవాఁడు, ప్రామిన్కతేప్రొద్దు ♦ నోముఁవాఁడు
నుసుటఁగన్గలవాని ♦ నుసుటఁగాచినవాఁడు, జగములఁగలిగించు ♦ చతురులాఁడు
తూర్పుదొరవేఁడివేలుప్ర ♦ దుంతకాతు, చేయినడకరిసంద్రంపు ♦ ఱేఁడుగాడ్పు
లిబ్బిదొరగిబ్బనెక్కుడు ♦ గబ్బిమగఁడు, కొలువఁదనరుచునుండును ♦ నలువయెపుడు.

ఆ. ఆతనిమానసంబునను ♦ హామహుఁలౌమునివర్యులత్తను
ఖ్యాతసుకాణ్వలాగమస ♦ దాధ్యయనప్రతిభావిశేషసం
జాతమహత్త్వతత్త్వవిల ♦ సద్ఘనబోధులశేషశాస్త్రని
ష్ణాతులఁగొందఱీజగతి ♦ వన్నెకెక్కిరివారిలోపలన్. ౨౫.

క. శ్రీవత్సనామధేయుఁడు, ధీవిశ్రుతసుజనతావి ♦ ధేయుఁడుజగతిన్
బావనుఁడైబుధకృతసం, భావనుఁడైతనరుసతని ♦ వంశమునందున్. ౨౬.

చ. కలిగిరికొందఱిందుకర ♦ కందళచంద్రశితారవిందని
ర్మలతరహారహీరశర ♦ రాజితభూధరశారదాభ్రమం
జులతరకీర్తిపాత్రులువి ♦ శుద్ధచరిత్రులులోకమిత్రుల
త్యలఘుకళాసమార్జితద ♦ యారసనిత్యులమాత్యులిమ్మహిన్. ౨౭.

క. వారలలోఁగణపార్యుఁడు, వారితమేధావిహార ♦ వాచస్పతియై
చారుతరకీర్తిసంపదఁ, జేరూఢికినెక్కెజగమ ♦ శేషముమెచ్చన్. ౨౯.

క. ప్రణుతద్విజరాజశిఖా, మణియైసార్వజ్ఞసాధి ♦ మనహీనలస
ద్గుణగరిమఁదనరివెలయున్, గణపతిసచివుండుప్రమథ ♦ గణపతియనఁగన్. ౩౦.

క. శ్రీవత్సగోత్రజలనిధి, దైవాత్మకుఁడైనగణప ♦ శౌరికతనికిన్
దేవేరియైనలచ్చమ, కావెంకటమంత్రిచంద్రుఁ ♦ డంతజనించెన్. ౩౧.

క. ఆతనికినిబోలమాంబకు, సుతులుద్భవమొందిరధిక ♦ సువ్రతమతులై
క్షితిగణపార్యుఁడనంగను, మతిమంతుఁడు వెంకటాద్రి ♦ మంత్రియనంగన్. ౩౨.

క. ఆయిరువురిలోనగ్రజుఁ, డాయతగుణశాలిగణప ♦ యార్యుఁడుదన్నరుఁ
ధాయామణిదమావిత, శ్రీయాజసతీతానుగతమ ♦ సువ్రతమనఁగన్. ౩౩.

క. ఆమంత్రివరుఁడునిజభా, ర్యామణిగాసిద్ధలింగ ♦ రాజతనూజన్
బ్రేమవరియించెఁజెన్నమ, నామురశాసనుఁడుభీష్మ ♦ కాత్మజమాడ్కిన్. ౩౪.

తే. ఘనుఁడుచెన్నమాంబికయందుఁ ♦ గనియెమువుర, గణపయార్యుండుసజ్జన ♦ ప్రణుతవిమల
చర్యులకుకేశవామాత్య ♦ సూర్యలింగ, నార్యమతిచక్రపామాత్య ♦ వర్యనెలమి.

వ. అట్టిపుత్రపౌత్రసంతానంబునందు. ౩౬.

సీ. అనఘతరస్వాంత ♦ ముచుబాదుగావించి, తనకరుణారసా ♦ దకమునించి
పద్మాక్షపదయుగో ♦ పఘ్నముల్ జతనూర్చి, సంశయదుష్కీట ♦ సమితిఁ ద్రుంచి
కీర్తనామలపేరఁ ♦ గిసలముల్ గలిగించి, స్మరణసుమశ్రేణి ♦ సంఘటించి
స్నేహాఖ్యమకరంద ♦ బాహుళ్యమొనరించి, సత్కర్మనివహావా ♦ సనగడించి
యనుదినంబునువర్ధిల్లు ♦ నలరునట్లు, కమలలోచనభక్తి ♦ కల్పవల్లి
నరసిపోషించిప్రాపించె ♦ నమితఫలము, సత్యలక్ష్మీలఁజక్రపా ♦ మాత్యవరుఁడు.

తే. అతనికనుకూలభార్యయై ♦ యఖిలబంధు, జనముదినమునుబోషించు ♦ ఘనతఁగాంచు
కసవరాజుకొండరాజువెం ♦ కటమగన్న, మహితసద్గుణనికరంబ ♦ మంగమాంబ. ౩౭.

సీ. అన్నదానస్ఫూర్తి ♦ నన్నపూర్ణయనంగ, ధృతిశాంతిపటిమభూ ♦ దేవియనఁగఁ
బతిహృదయానుకూ ♦ లతఁబార్వతియనంగ, ఖ్యాతసద్గుణముల ♦ సీతయనఁగ
ననఘశీలమ్ముల ♦ ననసూయయేయన, నలఘుచర్యలదమ ♦ యంతియనఁగ
నమితవైభవముల ♦ నదితిజాతయనంగ, విస్తృతకీర్తిసా ♦ విత్రియనఁగ
సకలబాంధవరక్షణ ♦ ప్రకటమహిమ, నన్నుతికనెక్కుసుగుణప్ర ♦ సన్నలీలఁ
దనరుమధరిత్రిఁ జెలసిల్లు ♦ ధర్మపరత, మానితవయోపలంబశ్రీ ♦ మంగమాంబ. ౩౯.

క. నారివ్రుఁ గావించిన, సారతపఃఫలమనంగ ♦ జనవరవదనాం
భోరుహముకురాయితముఖ, సారసతన్ గోటయభువి ♦ జనియించెనొగిన్. ౪౦.

శా. ప్రాయుఁ గమ్మలవక్కణల్ వసుసనే ♦ పద్దెంబులౌనట్లుగాఁ
జేయన్ సత్కృపబాంధవాప్తసుజన ♦ శ్రేణుల్ ప్రహర్షింపఁగా

నాయుక్ బెన్నలఁగన్నయంతమదికి ♦ డక్కల్ మీఱంగా మేలుది
ఖ్యాయుక్తినిధికోటయార్యుఁడనుచి ♦ ఖ్యాతింబ్రకాశింపఁజే. ౪౧.

సీ. తల్లిదండ్రులకన్న ♦ దైవంబుమఱివేఱె, కలదెయుంచుఁదలంచు ♦ ఘనమనీష
విద్వజ్జనామోద ♦ విస్మయావహముగాఁ, గృతులొనర్పఁగఁజాలు ♦ నతిశయంబు
స్వామికార్యైకని ♦ ర్వాహసామర్థ్యంబు, వెలయింపఁజాలువి ♦ వేకపటిమ
సజ్జనుల్ తనుమెచ్చ ♦ సంతతాచారప్ర, వర్తనవర్తించు ♦ విమలబుద్ధి
కలిగివెలసితసత్కీర్తి ♦ కల్పవల్లి, ఘనసమఫలాయమాన ♦ క్షత్రనివహ
కుముదజాహితమండలి ♦ నమరితేప్రభు, శాశ్వతగుణైకధుర్యకో ♦ టీశ్వరార్య. ౪౨.

మ. తనకున్ గోటయమంత్రినీదగు సము ♦ ద్యల్లేఖినీశ్లాఘనీ
యనినాదంబుకుతూహలాతిశయమ్ము ♦ త్యద్ధాత్రీసీమంతినీ
కనదంఘ్రిద్వయరత్ననూపురనిభం ♦ బౌ్కానానుకారానురం
జనవత్సారసునిస్వనంబయిన్పా ♦ స్థానంబులందెంతయున్. ౪౩.

క. ఈవిధమునబాంధవసం, భావితగతిఁదనరుపుత్త్రి ♦ పౌత్త్రసమగ్ర
శ్రీవిలసిల్లెనుభువిరా, జీవాక్షునికరుణఁజెంది ♦ స్థిరతరకీర్తిన్. ౪౪.

తే. కానహరియానతిచ్చిన ♦ కరణినీవు, హరువుమెఱయంగసత్కృతి ♦ పరిణయంబు
కృతివినిర్మించియతనికిం ♦ కితముసేయుము, మఖిలశుభములుగలుగునీ ♦ కతనికృపను.

వ. అని సబహుమానంబుగా విద్వజ్జనం బానతిచ్చిన నేనును మహాప్రసాదం బని వారల వచనంబు లంగీకరించి పరమహర్షతరంగితాంతరంగుండ నగుచు నవ్విరించిజనకునకు ముఖోల్లాసకరంబుగా భోజకన్యాపరిణయం బనుమహాప్రబంధంబు రచియించి యీ కృతికి నపరిమితకృపాపారావారుండును, నార్తత్రాణపరాయణుండును నగుగోపాలుండే నాయకుండు గావలయు ననుదృఢాధ్యవసాయంబున నమ్మహాత్మునకును. ౪౬.

షష్ఠ్యంతములు.

క. శ్రీరుచిరదివ్యదేహున, కారూఢపురాణవాక్య ♦ యుద్వాహునకున్
గారుణ్యాపకీవాహున, కారుణ్యాలసద్దృగబ్జ ♦ హతమోహునకున్. ౪౭.

క. కరుణాశరధికివికలిత, తరుణాశశధికిసమగ్ర ♦ తరశరధికిస
త్వరితభుజంగాశరధికి, నిరవధిగుణనిధికిశుభద ♦ నిజసన్నిధికిన్. ౪౮.

క. చాణూరక్షోణీభృ, త్పాణిగరుద్వివదళైక ♦ పరసురపతికిన్
వాణీశగ్వాణీగీ, ర్వాణీవరవర్ణనీయ ♦ వైభవధృతికిన్. ౪౯.

క. సద్గోహాత్తరళ్గోచిత, మద్గోర్జితపుత్రునకును ♦ బ్రత్యక్షివసా
కుక్షింభరి శాక్షేయుక, శిక్షితమధుసూదనశేఖర ♦ జిగ్గాత్రునకున్. ౫౦.

క. ప్రాజితబలభద్రునకున్, శ్రీజితరుద్రునకుఁ గాంది ♦ శీకన్యపపున
ర్యోజితభద్రునకున్నిఁ, స్వాజితభద్రునకునరిస ♦ గుణముద్రునకున్. ౫౧.

క. రాజావమానుశీముఖు, రాగరశిభురససంత ♦ తాస్వాదకళా
భోధనకేలునకున్ బహు, గోధనలోలునకుఁ గపట ♦ గోపాలునకున్. ౫౨.

గ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన భోజకన్యాపరిణయం బను మహాప్రబంధంబు
నకుఁ గథాక్రమం బెట్టి దనిన. ౫౩.

శా. శ్రీగోపాలకన్యకాలోలుఁడు పెరీ ♦ క్షిద్భూమిపాలుండు స
ద్యోగప్రాజ్ఞచరిత్రువ్యాసముని పు ♦ త్త్రుం జూచి యిట్లనియె నా
భ్యాగీర్వాణులు మెచ్చ భోజనృపక ♦ న్యం దెచ్చి యుక్ గౌరియే
లాగర్థిఁ బరిణయంబు చేఁ దెల్పుమనిన ♦ లక్కన్ దాపసుం డిట్లనున్. ౫౪.

మ. కలశత్నాలరశాలకేతనపటా ♦ విర్భూతవాతాహతో
చ్ఛలితాంభోధరగర్భనిర్గళితదం ♦ నచ్చంచలాశేముషీ
కలనాకర్షదభర్మహర్మ్యవిచర ♦ త్కాంతానితాంతప్రభా
కలితంబై యిల నొప్పు ద్వారవతి నాఁ ♦ గాఁ బట్టణం బెంతయున్. ౫౫.

తే. లోనికోటయే వలయాద్రి ♦ దానికవలఁ, గలుగుబలుకోట బ్రహ్మాండ ♦ కర్పరంబు
పరిఖజలపూరమవలియా ♦ వరణజలము, తోఁపులవ్వలి యురులునై ♦ తోఁచుఁ బురిని.

క. సన్నుతసవరత్నమ్ముల, కన్నగరంబుసికియగుట ♦ ననపాయతచే
మున్నిచ్చటఁ దాఁ గా, పున్నతంబమరఁ బరిఖ ♦ యొప్పం బురికిన్. ౫౬.

ఉ. ఆనగరంబు వప్రమున ♦ కావృతి యైనయగడ్తతీరునం
భోనిధి సారు సేర్పఁ బుపఁ ♦ బొంకము గామిఁ బ్రజల్ భ్రమింపఁగా
నావలి నోద్భవుండు సహ ♦ జాంబునిధిన్ జలనీలికామషిం
బూనిచి ముద్ర వేయఁగన ♦ ముద్రము నాఁ జను వార్ధి యిప్పుడున్. ౫౭.

తే. తటఖచితపద్మరాగసం ♦ తానదీప్తి, నలముకొనఁగఁ గెంజిగిఁ దాల్చి ♦ జలము పాలుచు
నిప్పుఁ గల్యాణమును బురిఁ ♦ బచ్చతోరణంబు తనరంగఁ దగు వసం ♦ తంబనంగ. ౫౯.

తే. ఛదిరిబంగరునిగనిగల్ ♦ చవులఁగమరఁ, బొదలు సౌధంబులెపుడున ♦ ప్పురమునందుఁ
దన్నగరలక్ష్మికటితటిఁ ♦ దాల్చినట్టి, మేలి మొలనూలిగంటల ♦ చాలనంగ. ౬౦.

క. మగరాజసంతతి మేడల, నిగనిగలందనరు నచటి ♦ నీరేజాస్యల్
తగుపాలకపలిం బోడమిన, మగువలగతిం బోలుతురనుప ♦ మానస్త్రీలన్. ౬౧.

సీ. సారహీరప్రభా ♦ సౌరాపగాలోక, నాగయూతసురతాప ♦ సౌవ్రతములు
భుజగభుక్మణివిభా ♦ పూరఘనాసాంకార, మందహాసానుకారి ♦ మైత్రకూరులు
శతమఖరత్నచం ♦ చద్దిప్తనీలాబ్జ, హారజోత్సుకవర్గ ♦ యావతములు
స్మరరంగకోత్రత ♦ పారిజాహితసప్ర, కుద్దనూద్యద్దివ్య ♦ కుంజరములు
పంచరచ్చంచదృగాన్య ♦ సత్ప్రికాశ, నైకిరశశాంకదర్పక ♦ జాతపూర్వ
నికటనరదుమకయనత ♦ నిఖిలభీమ, చస్మితదృగ్జగితులంత ♦ త్స్వాగతతులు. ౬౨.

చ. పురబహిరంగణస్ఫురిత ♦ పుష్పవనీలసమాననూనబం
ధురమకరందబిందుచయ ♦ తుందిలమందవనట్నాళింద మే
దురరవభృస్తసారరవ ♦ దుర్భరనిర్భరచాతపోతసం
కరగతిఘూర్ణహంబుమ్ముపు ♦ గంధవహంబలరున్ బురంబునన్. ౬౩.

క. తేజమునన్నతియుంగని, చేంజేరెడుఘనులతగులు ♦ వీడని వేడ్కల్
రాజులకున్ దత్పురిగృహ, రాజులకున్నైన్న జమగుచు ♦ రాజిలు నెప్పుడున్. ౬౪.

సీ. సత్త్వసంపదరాజ ♦ సముతేని చతురాస్యు, లాసురాలయమొంద ♦ నట్టిబుధులు
తమిం బూనితేజముల్ ♦ చెలుంగనిసూరులు, నరసంస్తుతికిం బోని ♦ పురుషవరులు
నుగ్రభావముం జెంద ♦ కుండుసర్వజ్ఞులు, సద్ధర్మ మెడలని ♦ జాతవేదు
లురుగురుభక్తినే ♦ మఱచికళానిధుల్, పక్షపాతములుగా ♦ ప్పడనిద్విజులు
సకలశాస్త్రార్థనిశ్చయా ♦ వికలహృదయ, యోగ్యవైరాగ్యసంతతా ♦ భ్యుదయధికృ
తావనీశ్వరదానధా ♦ రాప్రవృద్ధి, దీపకరుచౌరయమ్మురి ♦ విప్రవరులు. ౬౫.

ఆ. కొడుకుతంపనాల ♦ గోడవలనూరూర, దినముం దిరుగుచుండుం ♦ దనకులంబు
నడుమనప్రయోజ ♦ నంబయ్యెనని బ్రహ్మ, నగుదురచటి బ్రాహ్మ ♦ ణప్రవరులు. ౬౬.

ఉ. ఆనగరిన్ మహీసురు ♦ లహర్నిశముల్ రచియించమించుహో
మానలధూమమభ్రమున ♦ నభ్రతం గన్పడుభర్మహర్మ్యసం
తానములన్ మెలంగు నెలం ♦ తల్ నెఱిమించులుగాంగవారెవం
బూనినముత్తెపుంసరి ♦ ముల్ వడగండులు నైతనర్చుంగన్. ౬౭.

సీ. అనిలోనవోకిపట్ల ♦ వెనుతియ్యరనికాక, శతమఖాత్మజులంచుం ♦ జాటరాదె
పుణ్యజనాళినో ♦ ప్పటకోపరనికాక, దశరథాత్మజులంచుం ♦ దలంచరాదె

బహుముఖవ్యాహార ◆ పరతత్త్వసనికాక, క్రౌంచదారణులంచు ◆ నెంచరాదె
షష్ఠునివడిదాఁకి ◆ బెళఁకిపోరనికాక, పరశురాములటంచుఁ ◆ బలుకరాదె
పిరిసఁబోల్తురెపృథుని ◆ స్ఫీటవిజిత, శాత్రవమహాకళత్రక ◆ శత్రునేత్ర
విగళదస్రజలాంభోధి ◆ వృష్టిఘుటిక, ఘనయశశ్శ్రితకరులైన ◆ క్షత్రవరులు. ౬౮.

చ. నవనిధినాథుఁడీతఁడను ◆ నామముఁదాల్చియుమిత్రుఁడెంతయున్
నవయుదుమైక్షవృత్తినిది ◆ నంబునుగుప్తరంజనాదుమందుఁదా
నవనతియైనఁజేయుఁడని ◆ యాదకులన్ సయితంబుఁబ్రోతురా
వివిధచిరత్నరత్నధన ◆ విశ్రుతివశ్యులువైశ్యులప్పురిన్. ౬౯.

తే. అతులబలవృత్తిపేరికి ◆ హాలధరుండె, యుహా యనవచ్చుముసలిగా ◆ కుండెనేని
యనఁగఁగృషితోషితాఖిల ◆ మనుజులగుచుఁ, గీర్తిధరియింతురప్పురం ◆ బ్రభుజులుపీట.

మ. కరపుత్కారముదిక్కిరములు మే ◆ ఘుంఘుమ్రంమూలంబులన్
శరణంబంగిఁదలంపనోప్పనచటన్ ◆ స్తంబేరమవ్రాతముల్
పరిగంధప్రియనిర్గళత్తదజల ◆ ప్రత్యగ్రగంధోత్కరం
భరిడింభస్థలవంచనాపములు ప్రే ◆ మంగూర్పనత్యుత్థితిన్. ౭౧.

తే. పరగుపృష్ఠనీలాభ్ర ◆ పటలిఁబోలువ, సోఁగమెఱపులువరుసరాఁ ◆ జుట్టుకొనిన
కరణిఁదనరారుబంగరు ◆ కట్టుమెఱయు, దంతములనొడిదిప్రదం ◆ తావళములు.

చ. అతిజవయుక్తిచేఁదమకు ◆ నాసుగమెంతయుఁదక్కునోటుఁదా
మతిఁదలపోయుకవ్విధిస ◆ మానసమాహ్వయుఁగానొనర్చెనే
గతియునిమేలెయుంచునుప ◆ గంబలెమోముబవాంచియుంగ్రములన్
సతతమునేలఁద్రవ్వికొను ◆ సైంధవసంఘముఅత్పురంబునన్. ౭౩.

స్రగ్ధర. కనఘాతూచ్చోదకత్వ ◆ క్రమపదుఁడౌకఁడో ◆ కన్నడుదోడౌక్కటంగ్రముల్
గనుపట్లన్విక్రమశ్రీఁ ◆ గనియులకడలిన్ ◆ గ్రక్కునన్వాలకం
య్యావసింగప్రోద్భవశ్రీ ◆ నడపఁగఁగలవాఁ ◆ డంచునయ్యంగమాలిన్
వనమాలిన్ గిలిగేళిన్ ◆ వడిఁగడఁగినగున్ ◆ వాపురంబుల్ దినంబున్. ౭౪.

చ. తమనిమువాలుకీల్జడలు ◆ దంచితకీర్తిభుజంగకోటికిన్
దమినిగిడింపఁగాఁదమను ◆ ధామధురాధరపద్మరాగవి
భ్రమములుపల్లవాళికను ◆ రాగపుసంపదపెంపునింపఁగా
నమసుమరప్పురంబుననొ ◆ యారులువారసతుల్ కళావతుల్. ౭౫.

సీ. వలరాచజగడాలఁ ♦ గళలంటికరఁగించు, జాణయీ సంపూర్ణ ♦ చంద్రవదన
తరితీపుఁజెయ్యులఁ ♦ దమినిగిడింపఁగాఁ, జాలునోయయ్యారియీ ♦ నీలవేణి
ప్రౌఢ్యోకశాంతనే ♦ ర్పులకూటమిఘటించు, కొమ్మయీజక్కువ ♦ గుబ్బలాడి
కనుఁగొనినంతనే ♦ మనసుపుట్టఁగఁజేయు, ప్రోడయీజాళువా ♦ పైఁడిబొమ్మ
యనుచుఁదమలోననిజవిభ్ర ♦ మాతిశయముఁ, గనివిటులుచిత్రవాక్యసం ♦ గతులనాడ
హావభావవిలాసవి ♦ హారపరత, వెలవెలందులుబోలుతుర ♦ వీటిమందు. ౨౬.

సీ. కమలంబుమూరొక్కనం ♦ గావచ్చునేయన్నఁ, జెలినెమ్మొగమ్ములు ♦ ద్రిప్పికొనుచుఁ
జిగురంటిచూపంగ ♦ నగునచేయనఁగఁగెం, గేలిసైఁగలనంటఁ ♦ బోలదనుచు
నలరుబంతులుమాడ ♦ నగునచేయనజాలు, జిలుఁగుపయ్యెదఁజక్కఁ ♦ జేర్చికొనుచు
మంచినవిరియొల ♦ మాటదేయననటు, పైఁటకొంగునమోవి ♦ మాటికొనుచు
విటులనన్యోక్తులెఱిఁగియ ♦ న్వితమునకును, దాపడంబడనటులనే ♦ తమవిలాస
చేష్టలనువారికోర్కులు ♦ చిగురుద్రొక్క, నలరులమ్ముమువీటి ♦ వలఁబోఁడ్లు.

ఉ. పల్లవరాగ మ్ముక్తసులు ♦ బంతులురెండిపైపైటపాటుగా
నల్లనమాటియొంటిపసి ♦ మమ్మునకొందురెకొమ్మప్రౌఢ్వపూఁ
బొల్లగఁబోఁమనొక్కరున ♦ కుఁగయిశానుకసేతుగానపా
మొల్లమినిబ్బడిత్తునవి ♦ ముట్టఁగనిమ్మనసైఁగనవ్వుచుఁ. ౨౮.

క. పూవులువిలుతురుకమతము, పూవులుయువకోటికిఁగ ♦ డిందితమకముఁ
గావింపఁగఁబురవనితలు, భావింపఁగమరునిదండి ♦ బారంబోలెఁ. ౨౯.

క. అప్పురము నేలుఁగృష్ణుఁడు, గప్పురపుఁరజమువ్రాలెఁ ♦ గపెఁగెనిజయశం
బుప్పతిలదెసలఁగప్పిక, కప్పతిసతులకుదుకూల ♦ కోటిఘటింపఁ. ౩౦.

సీ. ఘనమైననృతిచేత ♦ జనులనందఱఁబ్రోచి, తామేటివిఖ్యాతిఁ ♦ దనరఁగాంచి
భూదారమహిమచేఁ ♦ బొగడొందజనముల, నరసింహవిస్ఫూర్తి ♦ నుతుపణించి
బలినిరాకరణత ♦ త్పరతవన్నియకెక్కి, శరణాగతత్రాణ ♦ బిరుదమూని
భూవరదానైక ♦ బుద్ధిచేవిలసిల్లి, కలిమిననంతభో ♦ గములనలరి
వెలయులోకజిదాటోప ♦ విభవమునఁ, ధర్మసంస్థాపనార్థమై ♦ దాడివెడలి
తనరుబహురూపధారణో ♦ దారవీర, ధర్మమయహారకంకణ ♦ ధారిశౌరి. ౩౧.

శా. నీలాంభోధరభాసురాంగుఁడుసళ ♦ న్నిచేజపత్రోల్లస
ద్వోలంబాంభకనీనికావిలసితా ♦ ఘూత్రైకశృంగారభా

న్యాలీఢానవసాయకప్రణిహితా ♦ ద్యంతాస్త్రసజ్జోదయో
ద్వేలాంభోధిలసద్దయాకరుఁడనన్ ♦ దీపించుఁ గృష్ణుండటన్. ౮౨.

సీ. ఆర్ద్రాంతరంగత ♦ నలరునీతఁడటంచు, ద్విజరాజుసాక్షిగాఁ ♦ దెలుపవచ్చుఁ
గరుణారసాఘూర్ణ ♦ కలితనేత్రుఁడటంచు, భానుఁడుసాక్షిగాఁ ♦ బలుకవచ్చు
బవతమోవిపిశన ♦ ప్రౌఢవక్త్రుఁడటంచు, ననలుండుసాక్షిగా ♦ నాడవచ్చు
సకలజీవావన ♦ ప్రకటభవ్యుఁడటంచు, శ్వసనుండుసాక్షిగాఁ ♦ జాటవచ్చు
గారవమ్లవిహృదయము ♦ స్పష్టారేకగుణ, మేలువిమలతభవిరవి ♦ ఫాలమహిమ
యుఁగనుతికెక్కు నిజభక్త ♦ వనమనూజ్ఞ, మాధవుండనఁదనరుర ♦ మాధవుండు. ౮౩.

క. ఈకీర్తిఁ బెరిమగుణపతి, భూరితరఖ్యాతి నెగడెఁ ♦ బోలుపు నీతిన్
ధారుణి మెఱుఁగనవారిత, సారతరైశ్వర్యసుర్య ♦ చర్యలనుండున్. ౮౪.

తే. ఉండుతజినొక్కనాఁడతం ♦ డుదయవేళ, నతులగాయకరచితగీ ♦ తామృతంబు
నలమిపోషితకరవా ♦ గమ్యతరసము, చెవులపండువు సేయను ♦ త్సవముమీఱ. ౮౫.

క. శేషీకృహముస్ వెలువడి, బాలామణియోర్తుపసిఁడి ♦ పావలుఁదొడుగన్
వేఁగతివరిగిమణీ, జ్వాలావృతమైనయుబ్బు ♦ చప్పరమందున్. ౮౬.

క. అంగనలుంచినచొక్కపు, బంగరుపీటన్ వసించి ♦ బహుమతియలరన్
ముంగలఁ బోఁచుమహీసుర, పుంగవయోగమునకువినయ ♦ మునఁగేల్మోడ్చెన్. ౮౭.

తే. కేలుమోడ్పుఘటించిబా ♦ గాలొసంగి, పనిచితినచెక్కుటద్దంబు ♦ ప్రభలుమేలొ
దీనిప్రభమేలొపరికించి ♦ తెలుపుమనిన, దారినొకనారిపట్టిన ♦ దర్పణమున. ౮౮.

సీ. చిగురాకుమోవిపైఁ ♦ దగుపచ్చిపలునొక్క, నిడువాలుఁగన్నుల ♦ నిదురసొక్క
కొనగుబ్బపోటునఁ ♦ గుమ్మైపోయినయక్క, నెలవంకఁబచరించు ♦ తళుకుఁజెక్క
చిటిలఁగంధముత్రోడి ♦ జీనిసర్వెనచిక్కు, మినిమిదుప్పటిఁదోఁను ♦ పసపుటెక్క
పూవింటికొరకయ్య ♦ మునఁగోఁచుబలుటెక్క, లెతెఁగించుశృంగార ♦ భరమునిక్క
నెరయఁగనుపట్టుతనజాడ ♦ నీడఁజూచి, మొలకనవ్వులుగనుదోయి ♦ మొలకలెత్త
మేటిసొగసునమీసాలు ♦ దీటికొనుచు, శౌరిపలుదోమికొనియెనొ ♦ య్యారముగను.

మ. ఒకనారీమణియిచ్చుకేలఁదనకే ♦ లొంటించిలీలాగతి
న్వికచాంభోరుహలోచనుండపుడుసా ♦ న్ద్రీభూతనీలాశ్మత
న్నికటానద్ధసమృద్ధహీరమణిరు ♦ క్సిరేజమిత్రాత్మజా
ప్రకటాకాశధునీనిదానసదనో ♦ పాంతంబుస్నానార్థమై. ౯౦.

రించు జలవిహంగమనినాదంబులకుం జొక్కి వియచ్చరపథంబుననుండి యచ్చోటికిం దిగు
నంచపిండు వారి దగు నుల్లోచసముల్లసితసితవసనవిసరప్రతిఫలనసాంద్రతరచంద్రకాంత
మణిమయస్తంభంబులను, చంద్రకాంతమణిగణప్రభాంకూరంబులను, వికస్వరకైరవవా
రంబులను, పరిపూర్ణంబు లగుఘనసారకణమ్ములం దగినతదంతరాళబింబితగోమేధిక
ప్రభాంకురంబుల నలంకృతం బగుకమలాకరం బనం దగి కమలాకరంబయినయాస్థాన
మండపంబులు సొత్తెంచి సముచితచిరత్నరత్నఖచితసింహాసనంబునం బేరోలగం
బుండి బలభద్రసాత్యకిప్రభృతిభ్రాతృనివహంబును గృతవర్మప్రముఖబంధుసందోహం
బును, దండనాథపురోహితామాత్యవిద్వత్కవిగాయకప్రముఖులును, బలసి కొలువం
బ్రహృష్టాంతరంగంబున. ౧౦౩.

సీ. ఒకచక్కిరాయసాల్ ♦ ప్రకటవాగ్వైఖరిఁ, జదువు లైదినసరుల్ ♦ చదువుచుండ
నొకచాయఁ గరణికుల్ ♦ సకలదేశంబుల, కనుబడికవిలెలు ♦ వినికిసేయ
నొకవంక నుబ్రధాను ♦ లకలంకగతిఁ జేరి, వివిధంపుజ్యస్థితుల్ ♦ విన్నవింప
నొకదిక్కున నియోగు ♦ లుచితవర్తనరీతి, రాజకార్యప్రవ ♦ ర్తనలు దెలుపఁ
గలితకంకణఝణంఝణ ♦ త్కారగతుల, వరుసవారిజగడవింజామ ♦ రములు వీవఁ
బత్తుచిత్రైకభాషణా ♦ దరము మెఱయ, నిండుగొలువుండెయాదవా ♦ ఖండలుండు.

వ. అయ్యవసరంబున. ౧౦౪.

సీ. చిఱునాగుపడగల ♦ వ్రజాలుకన్నములతోఁ, గట్టిననిడుపీలి ♦ కాసెతోడ
వలమూపుపయిమించు ♦ చలిదిచిక్కముతోఁ, బెట్టినబిసవారు ♦ మెట్లతోడ
నాసికాగ్రముమీఁది ♦ సాక్షినామముతోడఁ, దనరారుపొన్నైద ♦ త్రాడుతోడఁ
జొప్పడఁ బిగిగొన్న ♦ కప్పుకుళ్లాయితోఁ, బట్టినయొకకమ్మ ♦ చుట్టతోడఁ
ద్వరితగతి సేగుటకుఁ బొంక ♦ పఱచినట్టి, చెట్టుపలకరీతి నాదలం ♦ జుట్టినట్టి
జిల్లయుల్లియచెఱఁగులు ♦ వెంటనంట, డాయఁజను దెంచె నొంటరి ♦ బోయఁ డొకఁడు.

క. వనుదెంచి కనకసింహా, సనమున నెలకొన్నకంస ♦ శాసను నెదుటన్
వినయమునఁ మ్రొక్కి పత్రికఁ, జనవరియుడిగములచేత ♦ సభయత నొసఁగెన్. ౧౦౫.

తే. ఒసఁగినను వారుకృష్ణుని ♦ యొద్దనునిచి, యతనికనుసన్న వానిదా ♦ యంగవచ్చి
యెవ్వఁడవు నీవు పత్రిక ♦ యెవ్వరనచి, రిదియొతింగింపుమనినవాఁ ♦ డిట్టులనియె.

క. కుండినపురిని మ్భూమిగ, నుండునమాత్యుండు ప్రకటి ♦ తోత్సవవార్తా
మండితరేఖయొసంగగన, ఖండితమలిరియము మెఱయఁ ♦ గాఁబనివింటిన్. ౧౦౬.

తే. అనినవానికిబహుమాన ♦ మగ్గలముగ, ఘోటికముఖంబుగానిగ్గ ♦ ౘనిచియపుడు
తనదుబిరుదులఁగనుఁగొనఁ ♦ దక్షిణంబ, వారుపనిపించిరిటుకమ్మ ♦ వక్కణలను.

సీ. శ్రీమదఖండల ♦ క్ష్మాసుసంపన్నుఁడౌ, వెన్నునకేనంపు ♦ విన్నపంబు
లిచటికార్యస్థితి ♦ కెల్లఁబొల్లు నెస్వామి, వారికి నేవిన్న ♦ పంబునంపి
వాఁడెఁగాభీష్మక ♦ నరపతితనపుత్రి, కాయూథయౌవన ♦ కలిమిఘుదముగా
నుద్వాహమొనరింప ♦ నుత్సుకుఁడైస్వయం, వరమునకైరాజ ♦ వరులనెల్లఁ
బిల్వంపించె నెంతయుఁ ♦ బ్రేమమీఱ, మీరలిటురాఁగఁగోరితో ♦ మేరమీఱ
నుత్సుకతమిమ్ముఁబిల్వంగ ♦ నుత్తరవునొ, సంగవిచ్చేయవలయును ♦ జక్రపాణి.

క. అనిపమువు విన్నపంబును, వినివనజేక్షణుఁడుహృదయ ♦ వీధిన్నిండం
గనుపట్టుకుతుకమింతయుఁ, గనుపడనీఁడయ్యె నెమ్మొ ♦ గమ్మున నానన్. ౧౧౨.

ఉ. క్రొన్ననవిల్తుతండ్రియిటు ♦ కోరికలీరికలెత్తనత్తఱిన్
బున్నమచందమామయనఁ ♦ బొల్పువహించినయాస్యసీమను
త్పన్నసుధారసంబనఁగ ♦ భాసిలులేనగవంకురింపఁగాఁ
బన్నినిమాటనిట్లనియె ♦ ధీరతమీఱసభాజనుల్వినన్. ౧౧౩.

తే. ఇపుడువచ్చినకమ్మలో ♦ విపులకీర్తి, భీష్మకనరేశ్వరుఁడుకూఁతు ♦ పెండ్లిసేయఁ
దలఁచిరాజులనందఱఁ ♦ బిలువఁబనిచి, యందుమీఁదటమనముని ♦ కచటికిపుడు.

ఉ. రమ్మనినాఁడటంచుఁగద ♦ వ్రాసినవాఁడు నియోగియుత్తరం
బమ్మెయినున్నదిక్రియకు ♦ నందఱుమీరలునిశ్చయించి కా
ర్యమ్మిదియందుఁ జెల్వనగు ♦ నాప్తులుచూచివచించినట్టివా
క్యమ్మున నేకదావిభున ♦ కబ్బుసమస్తశుభంబులెప్పుడున్. ౧౧౪.

తే. అనుచుసర్వజ్ఞుఁడయ్యును ♦ వనజనాభుఁ, డాడువినయోక్తులకుఁజాల ♦ నలరిసభ్యు
లందఱాతనిసౌలభ్య ♦ మతిసివినయ, మాతనిప్రియంబుఁబరికించి ♦ యనిరిమగుడ.

ఉ. నీరజనాభకార్యముల ♦ నిశ్చయమిట్టిదటంచుఁజెల్పఁగా
నేరుమవారలుంగలరె ♦ నీయెడటన్సకలాంతరాత్మవై
నేరచినట్టివారలను ♦ నేరనివారనిపించిదిద్దఁగా
నేరిచినట్టిదేవుఁడవు ♦ నీకొకరాయెఱిఁగింపనేర్పరుల్. ౧౧౫.

తే. అయినమానేర్పువితముల ♦ నరసిపలుకు, విన్నపములాలకింపుము ♦ విశదభంగి
పెంపుమఱకంబుపల్కులు ♦ ప్రీతితోడ, ముద్దుసేయుచువినుదాని ♦ ముదనిచారి.

క. త్వరితగతిని ప్రేషకుండైన, పురికిం జనియె చటభీష్మ ◆ భూపతియొసఁగన్
దరుణీమణి యగు రుక్మిణి, నరయఁగఁ గొని తేరనొకరి ◆ నడుగన్వలెనే. ౧౧౯.

క. కాదని స్వయంవరమ్మా, పాదించిన భీష్మకుండె ◆ పరికింపఁగని
ర్భేదించి సకలనృపతుల, నాదటఁ గొని తెమ్ము నీవు ◆ నందఱు మెచ్చన్. ౧౨౦.

తే. అనుచు సామాజికులు దోఁచి ◆ నట్లు పలుక, బుద్ధిమజ్జ్యేష్ఠుఁ డనవొప్పు ◆ నుద్ధవుండు
శౌరికను విన్నఁ జేరియా ◆ సన్నసీమ, వారివారించి చాతురి ◆ మీఱఁబలికె. ౧౨౧

ఉ. సేవకులెందుఁ గార్యగతిఁ ◆ జిత్తమునందలపోసి నీతిగా
భూవరుతోడఁ బల్కుటకుఁ ◆ బోలుదురట్లను గాక నెమ్మితో
దేవరవారు నన్ బహుమ ◆ తిన్ సరివారలు మెచ్చఁ జాల సం
భావితుఁ జేయుటన్ హితము ◆ వాటిలయుక్తమె పల్కఁ గున్ హరీ. ౧౨౨.

చ. మనుజుఁడు కార్యసిద్ధికయి ◆ మానుషయత్నమొనర్చువేళ నె
మ్మనముననిశ్చయించి మతి ◆ మంతులకెల్లను సమ్మతంబుగా
నొనరచె నేని దానజయ ◆ మొందును దైవవశంబు గాక తె
క్కునతఁడేమి సేయునని ◆ క్రిందుగ నెంచరు పెద్దలాతనిన్. ౧౨౩.

శా. కృత్యాకృత్యవివేకశూన్యమతియై ◆ కించిజ్ఞుఁడౌ మానవుం
డత్యంతంబును లోభబుద్ధిఘనకా ◆ ర్యారంభముల్ సేయుటల్
ప్రత్యంతాద్రిదరీమిళన్మధురసా ◆ స్వాదార్థమై యాశచే
నత్యుచ్చాద్రిశృంగవాసియటకన్ ◆ హస్తించునట్లౌఁగదా. ౧౨౪.

తే. త్వరితగతి లౌకికకార్యంబు ◆ దలఁచి సేయ, దానఫలమంద నేరఁడు ◆ ధరణినరుఁడు
శ్రౌతకర్మంబు సాంగతఁ ◆ జలుపకున్న, సఫలతఁ ఫలింపవి దెనిద ◆ ర్శనము గాదె. ౧౨౫.

ఉ. సూరిజనాభిరంజకుఁడు ◆ సూనృతవాదియు సజ్జనావళీ
దారుఁడు లోభమోహమద ◆ దారుణవర్తనదూరుఁ డార్తమం
దారుఁడు విక్రమాన్వితుఁడు ◆ ధైర్యసమగ్రుఁడు నీతియుక్తుఁడున్
భూరివివేకసక్తుఁడగు ◆ భూపతి యేలఁడె దీవులన్నియున్. ౧౨౬.

మత్తకోకిల. భూజనంబులు మేలు మేలన ◆ బుద్ధిమంతుల సంగతిన్
నైజకృత్యములాచరింపుచు ◆ నవ్యకీర్తి దిగంతముల్
రాజిలన్ సమదారివీరుల ◆ రూపు సేయఁగ నోపుబల్
తేజమున్ గనరాజు కల్మియ ◆ తిస్థిరత్వము నందదే. ౧౨౭.

సీ. కావుననీగతిఁ ♦ గల్యాణవర్తన, నీతియుక్తతనొప్ప ♦ భూతలేశుఁ
డలరుమహీస్థలి ♦ నవనీతలాధీశ, మాత్రుంచవేనీవు ♦ మధువిరోధి
సకలబృందారక ♦ సంఘకిరీటాళి, మణిగణరంజిత ♦ మహితచరణ
నిఖిలలోకంబుల ♦ నీవెఱుంగసమట్టి, యర్థంబుగలదెలే ♦ శాంశమైన
నైన నేఁజేయు విన్నపం ♦ బవధరింపు, కుండినపురాధిపతిచేత ♦ నుండివచ్చి
వారుపలికినయర్థంబు ♦ సారఘణితి, విశదభంగిని వివరింతు ♦ విమలచరిత. ౧౨౮.

సీ. బంధుసమ్మతిమీఱఁ ♦ బద్మాక్షిరుక్మిణి, పెండ్లిసేయుటకునై ♦ భీష్మకుండు
దలపోయునప్పుడు ♦ తరుణికిఁదగునట్టి, వరుఁడెవ్వఁడనసభ ♦ వారలెల్ల
భవదీయగుణములు ♦ ప్రకటించి శౌరికిఁ, గన్నియనిచ్చు జ ♦ గద్ధితంబుఁ
గావింపుమన రాజు ♦ గరము సంతసమొందె, వినిరుక్మియనెడున ♦ వ్విభునిసుతుఁడు
చాలు వెషమాటలిఁక శిశు ♦ పాలుఁడుండ, బాలనన్యులకీయంగ ♦ నేలయనియె
నిరుతెఱంగులమాటల ♦ కేమియనక, మహిపతి స్వయంవరము సేయ ♦ మదిఁదలంచె.

మ. మనుజాధీశసుతలంపుఁగైకొనకదు ♦ ర్మానంబుతో రుక్మిదు
ర్జనులైనట్టి సుయోధనార్కజజరా ♦ సంధాదులంగూడి చై
ద్యునకేనిచ్చెద నాసహోదరినిశా ♦ రోత్సాహబాహాబలం
బునఁగాదంచుఁగడంగు మన్నెదొరలం ♦ బోకార్చెదన్ బేర్చెదన్. ౧౩౦.

క. అనియలవిగాని క్రొవ్వునఁ, గనుగానకయున్నవాఁడు ♦ ఘనమూఢమతిన్
జననాథసుతుఁడటంచున్, వినఁబడియెను మతియుఁ బెక్కు ♦ వితములనిచటన్.

ఉ. కావున మీరలందరుఁ ♦ గ్రందుగ భీష్మకరాజనందనున్
భూవరులెల్లఁ గూడికొని ♦ పోరికినుద్యతులౌట సిద్ధమం
దేవగ నిర్వహింపనగు ♦ నెవ్వఁగఁ గన్యఁగ్రహింపఁ గాఁదగున్
దేవరయీవితంబులెదఁ ♦ దిన్నఁగ నెన్నికడంగ మేలగున్. ౧౩౨.

క. అనియిట్లుద్ధవుఁడాడన్, వినిబలదేవుండు క్రోధ ♦ విహ్వలమతియై
యనిమొమధుమదవిఘూర్ణిత, కనదాయతలోచనముల ♦ కడఁగెంపడరన్. ౧౩౩.

శా. ఏమేమీ హరికిత్తుఁగన్నెననిఫా ♦ త్రీశుండు చింతింపఁగా
నామీఁదన్ మతిరుక్మి చైద్యునకుఁదా ♦ నర్పింతునంచెంచెనా
భామారత్నమునింత క్రొవ్వుగలదా ♦ బాగాయెఁగా యిచ్చుటన్
రాముండుండఁగ వెఱుంగఁడో యెఱిఁగియున్ ♦ బ్రాణంబులేయొల్లఁడో. ౧౩౪.

క. కుండినపతిఁ గన్ని రుక్మి, కుండిన నేమాయె మాయ ◆ యోయుపియనిన
ట్లుండఁబటుచండబలనో, ద్దండహలుండనయి యేన ◆ తరుణిన్ దెత్తున్. ౧౩౫.

తే. అప్పుడచ్చోటఁ గలిగిన ◆ యవనిపతులు, మనుజమాత్రుని గానన్ను ◆ మదిఁదలంచి
కదఁగి రేని యాఁగాంతుఁ ◆ గాకనాఁడు, ముసలదండసముద్దండ ◆ పసరణంబు.

మ. ముసలాఘాతవిశీర్ణశాత్రవకుభృ ◆ న్ముఖోత్తమాంగచ్ఛటా
ప్రసరద్రక్తములాని భూతతతులా ◆ ర్వన్ బర్వఁగంధర్వహ
స్తిసమూహంబు పనాతి పంచయముధా ◆ త్రిన్ జాపకట్టైవడన్
వెసఁ గ్రీడింతు మహాహవంబున భుజా ◆ విస్ఫారశౌర్యోన్నతిన్. ౧౩౭.

క్రౌంచపదవృత్తము. క్ష్మాతలనాథ, వ్రాతము నాపైఁ ◆ గదనమహోన్నతిఁ గనఁగిరయేనిన్
శాతహలాగ్ర, స్ఫూర్యతశిరోధి ◆ ప్రవదుకురుధిరా, చ్ఛాదితవృత్తిన్
గాతరలీలన్, ఘాతలవ్రాలన్ ◆ గనుఁగొని మనమునఁ గలఁగుచుఁ జైద్యుం
డాతురుఁడౌనటు, లాతతశౌర్యం ◆ బమరులు వొగడఁగ, నతివను దెత్తున్.

క. అతివఁ గొని తెచ్చి యీగతి, నతిశయితప్రీతి నిత్తు ◆ హరికిన్ దైత్య
ప్రతతింజయించి భూనతి, పితమతి నింద్రునకొసఁగును ◆ పేంద్రునిలీలన్. ౧౩౯.

తే. ఇట్లు బలభద్రుఁడాడెను ◆ హితతమోక్తి, కెంతయును నెమ్మనమ్మున ◆ సంతసించి
యతివచేసినయట్లన ◆ మతిఁదలంచి, భేరిమ్రోయించె హరి యాత్ర ◆ బోరుకలఁగ.

సీ. అంబుజేక్షణుఁడంత ◆ నధికారులను జూచి, యెల్లి కుండినపురి ◆ కేగవలయుఁ
గావున రథరథ్య ◆ కరిపదాతివ్రాత, మాయతమైయుండు ◆ నట్లు సేయుఁ
డనుగతులయి వచ్చు ◆ నఖిలసామంతులఁ, బిలిపింపుఁడిపుడచా ◆ రులను బంచి
పటకుటీరకటాహ ◆ పటుకటాదుల నెల్లఁ, దోడ నెకొని తెచ్చు ◆ జాడ నెరపుఁ
డతులమణిమయబహుభూష ◆ ణాంబరములు, కుంకుమపటీరకాశ్మీర ◆ సాంకవాబ్జ
మృగమదకరండతండముల్ ◆ తగువితానఁ, బూని తెండని శ్రీకృష్ణుఁ ◆ డానతిచ్చె.

తే. ఇట్లు నియమించి యమ్మర్యాద ◆ వేశ్వరుండు, హితపురోహితసామంత ◆ నృపుల నెలమి
వీడుకొలుకుఁబంచి తానును ◆ విభవమెసఁగ, రహిఁజెలంగెడు నంతఃపు ◆ రమునకరిగె.

శా. ఈరీతి న్నగరంబుఁ జేరి కమలా ◆ ధీశుండు మాధ్యాహ్నిక
ప్రారంభంబులు నిర్వహించి విబుధా ◆ ర్చల్ దీర్చి సద్భక్తిమై
భూరిబ్రాహ్మణపూజయు న్నెరపి యం ◆ భోజేక్షణానీతశృం
గారానర్ఘమణిప్రదీపమున వే ◆ డ్కల్ మీఱఁగా నున్నెడన్. ౧౪౩.

సీ. అంగనామణి యోర్తు ♦ బంగారుపళ్లెంబుఁ, దెచ్చియుంచఁగ నొక్క ♦ మచ్చెకంటి
తెలివిచ్చు నోగిర ♦ మొలకప్పుమ గూర, లూరుబిండ్లును జారు ♦ లూరుగాయ
లంబళ్లు శిఖరలు ♦ నావపచ్చళ్లును, బరమాన్నమును గల ♦ వంటకంబు
వరుగులప్పడములు ♦ వడియముల్ ఫలములు, ఖండచక్కెర తేనె ♦ పిండివంట్లు
లానరుసుఁ ఫేణిగవ్యస ♦ ద్యోఘృతంబు, నిర్మలనవీనదధియును ♦ నీరుమ్మారు
నాదిగాషడ్రసోపేత ♦ మైనయన్న, మపుడు వడ్డింప వేడ్కచే ♦ నారగించె. ౧౪౪.

క. తదనంతరంబ చేతుల్, పదపద్మములలమిగన్న ♦ పత్రాక్షుఁడు స
మ్మదమొదవ నుచితగతిశత, పదములిడి పఠించె రామ ♦ భద్రుని చరితన్. ౧౪౫.

శా. కాంతారత్నము చెంగటన్నిలిచి బా ♦ గాలీయ నక్షత్రరా
ట్కాంతానర్థపితద్దికాతలమునన్ ♦ గంజాక్షుఁడాసీనుఁడై
యొంతే వేడ్కఁ జెలంగె హాటకమయ ♦ ప్రేంఖన్మణీపుత్త్రికా
సంతానార్పితదివ్యచామరమరు ♦ చ్చంచత్కచోపాంతతన్. ౧౪౬.

క. ఈరీతి నున్నయెడ దా, వారికుఁడొక్కఁడరుగుదెంచి ♦ వారిజనయనుం
జేరి వసనాంచలమ్మున, నోరున్ మాటుకొని యిట్లు ♦ నుడివెనయోక్తిన్. ౧౪౭.

తే. దేవ యవధారు ధారుణీ ♦ దేవముఖ్యుఁ, డొక్కరుండిప్పుడెందుండి ♦ యోయిఉంగ
మననగరి వాకిటికి వచ్చి ♦ తనవితంబు, పన్నపము సేయుమనఁబని ♦ వింటిననిన. ౧౪౮.

చ. పలికిన యట్టులత్తఱియు ♦ దూద్వహుఁడాతనిఁ గెంపునింపు చూ
డ్కులఁ దిలకించి యోరిజడ ♦ కోరినవత్తురె యట్టి పెద్దల
య్యలఘుగుణాఢ్యులాఁగుటకు ♦ నష్టమె వాకిట నాదు చిత్తమున్
దెలియ వివేకమేగికొని ♦ తెమ్ముఁక నైనను ద్వాళి తెన్ నినున్. ౧౪౯.

తే. తెచ్చిన నుదారమున నెభూ ♦ దేవుఁ జూచి, పచ్చవిలుకాని తండ్రి స ♦ ద్భక్తి లేచి
యచ్చెరువు దోఁప నర్ఘ్యపా ♦ ద్యములనిచ్చి, ముచ్చటలరంగఁ దత్పద ♦ మ్ములను నెఱఁగి.

క. ఎచ్చటనుండియొ నీవిపు, డెచ్చటికేగెదవు కామ ♦ హీసురవరనీ
వచ్చుటను జేసి మద్గృహ, మెచ్చెనఁట సమస్తశుభస ♦ మాహితమయ్యెన్. ౧౫౧.

ఉ. ఎవ్వరు మీరు మీయునికి ♦ యెచ్చట నేమినిమిత్తమిత్తఱి
న్దవ్వుగ నిట్టులొంటిగ జ ♦ నమ్ములకేరికిఁ జేరరాని దా
నివ్వనరాశిఁ జొచ్చితిర ♦ భీష్టములిట్టివి నావచింపుఁడే
నివ్వల సేయఁగావలయుఁ ♦ గృత్యములుండిన నానతీఁదగున్. ౧౫౨.

క. వినియుండుదుఁ బెద్దలచే, ననఘా యభ్యాగతస్స్వ ♦ యంవిష్ణువనన్
దనఘువచనంబుఁ గావున, నినువా పాలింటిదేవు ♦ నిగభావింతున్. ౧౫౩.

క. మణులు ధనధాన్యములుఁ గో, గణములు మాకెపుడు మిగులఁ ♦ గలుగుచునుండున్
గణుతింప నమోఘబ్రా, హ్మణాశిషయనఁదగుతావ ♦ కాశీర్మహిమన్. ౧౫౪.

క. దైవాధీనము లోకము, దేవత మంత్రావళికిన ♦ ధీనము తన్మం
త్రావళి విప్రాధీనము, కావున విప్రులకు సములు ♦ గలరే జగతిన్. ౧౫౫.

క. లీలామానుషతనుచిత్ర, కేళీపరతంత్రుఁడనుచుఁ ♦ గృష్ణుండిటులన్
బాళినడుగంగ మృదువా, క్పాళిం బ్రాహ్మణుఁడు వల్కెఁ ♦ బద్మాక్షునితోన్. ౧౫౬.

తే. సకలజగదీశ్వరుండవై ♦ యకలుషప్ర, భావమునఁ దేజరిల్లు భూ ♦ దేవదేవ
భూమిభారంబుఁ దీర్పంగఁ ♦ బూనియిట్టు, లవతరించిననిన్నెంచ ♦ నలవియగునె.

శా. జలరాశిశ్రితవేదికాంతరలస ♦ చ్ఛైత్యాలబర్హిస్స్ఫుర
జ్జ్వాలదంభోరవమంత్రఘోషఘనగో ♦ షప్రజ్వలద్వహ్నికీ
లలనాసోమకుఁడన్మహాపశువునా ♦ లంభించి వేదాప్తిఁగాన్
ఫలమున్ జెందిన సోమయాజి నినునేఁ ♦ బ్రార్థింతు మత్స్యాకృతీ. ౧౫౭.

చ. మహితపయోజరాగఫల ♦ మౌక్తికసంచయసూనసంతతా
విహితభవర్తమందరకు ♦ భృద్ధరణీరుహమూలవల్లులా
యహికులలోకవాసిబలి ♦ హర్మ్యమునంటినఁదన్మణీతతుల్
నిహితములౌనటంచుబలె ♦ నిల్చితివట్టముడంభకచ్ఛపా. ౧౫౮.

ఉ. మత్తిలియున్న దేవరిపు ♦ మస్తకమున్ బలుఁదుంగముస్తనాఁ
దుత్తుములై చనన్ మసవి ♦ త్రోడనెయాశతపత్రపున్నమం
బొత్తులపట్టికింగొడుగు ♦ బొంగరమీ వెసనానకొల్పిన
ట్లొత్తివెయిమ్మహీవలయ ♦ మింతయుఁగోలవరాహమోహనా. ౧౬౦.

శా. రక్షస్సంచయరాడురస్స్థలము శౌ ♦ ర్యప్రౌఢతన్ గోళ్ళచే
నక్షీణాహతి వ్రక్కలించి ఖసము ♦ ద్యద్రక్తధారాచ్ఛటా
ప్రత్యుభ్యద్దివిషద్విషచ్ఛలభవా ♦ ర్థప్రాణసంహారకృ
ద్దీక్షాదక్షమహోగ్ని చేసెనఁగదే ♦ దివ్యన్నృసింహాకృతీ. ౧౬౧.

చ. బలిసుమహాత్ప్రితాపశిఖి ♦ బంధురలీలధరాభ్రవీధులన్
దళముకొనన్ భవచ్చరణ ♦ తామరసోదమరందధారచే

మలఁచితదీయమాభయము ♦ మానుతునంచుఁదలంచి కాకయీ
యిలయుదివంబుఁబొదమున ♦ నెక్కువనాను దెవామనాకృతీ. ౧౬౨.

మ. ధరణీనాయకకంఠలుంఠనసము ♦ ద్యద్రక్తధారాప్లుత
స్వరుతుల్యాచ్ఛసముజ్జ్వలత్పరశువం ♦ సంబంధుభాసిల్లఁగా
నరవిందాప్తసమగ్రబింబగతపుం ♦ గ్వాదిన్ విడంబించుభూ
సురవంశాంబుధిసోము రాముపరితే ♦ జోధామనిన్ గొల్చెదన్. ౧౬౩.

సీ. అంభోధిశోషణ ♦ ప్రారంభణోత్థమ, హాభీలకుంభోద్భ ♦ వాయితములు
రక్షోధిభూకంఠ ♦ రాజీవలుంఠన, బంధురమత్తద్వి ♦ పాయితములు
ఘటకర్ణదేహాద్రి ♦ ఖండనోద్యత్క్రియా, సశతారహరికులి ♦ శాయితములు
దూషణఖరముఖ ♦ దోషాచరానీక, శలభగణాశ్రయా ♦ శాయితములు
తావకీనాంబకమహాక ♦ దంబకములు, భక్తజనదుఃఖసంఘముల్ ♦ పాపుఁగాత
సకలసద్గుణగణలోల ♦ సత్యశీల, జనకతనయామనోహారి ♦ శరణుశౌరి. ౧౬౪.

చ. ఉరుతరరేవతీకుచస ♦ మున్నతభూధరశృంగవిస్ఫుర
ద్వరహరిచందనప్రకట ♦ వాసనఁజొక్కియహీనవృత్తిచే
ధరణిజనంబుదాంతకుల ♦ ధర్మము నెప్పుడు నాచరించుచొ
ప్పరయుచు నీవు సంతతము ♦ నట్లొనరించితి గాబలాత్మకా. ౧౬౫.

ఉ. ఆసురకామినీస్థిరత ♦ మామలశీలము తత్తనుత్రయా
గ్యాసవవైరిసంయమన ♦ కౌశలమేర్పడనంబకంబులన్
వేసమవృత్తిఁగీడ్పఱచి ♦ విశ్వమనావిలవృత్తిఁజొప్పడన్
జేసితి కాదె నీనహహ ♦ చెచ్చెఱమారజిదాకృతీహరీ. ౧౬౬.

మ. ప్రకటక్రీడహయంబు నెక్కితశధా ♦ రాపంచకాంచద్గతిన్
సకలక్ష్మాతలమెల్లఁగ్రుమ్మరికలి ♦ స్ఫాయన్మహోదగ్రపా
తకసంక్షాళనమాచరించుసుకృతి ♦ ప్రాజ్ఞైకదీక్షాయతా
త్మకునిన్నున్ మదిలోభజింతువిసమ ♦ న్మందారకల్యాకృతీ. ౧౬౭.

మ. రమణత్వత్పదకంజసంగతిభవ ♦ ద్రాగాత్తరోమాంచసం
క్రమితాంగంబునఁబొల్చెభూసతి యనన్ ♦ ఘాసాంకురశ్రేణిన
ర్యమపుత్త్రీతటభూమిఁజెన్నొదవగో ♦ త్రాజ్ఞైకదీక్షామతిం
బ్రమదంబందినయాతనిన్ గొలుతుగో ♦ పాలావతంసాకృతీ. ౧౬౮.

క. నాకతవినుమిఁకనిచ్చటి, కేకతమునవచ్చినాఁడ ♦ నేనదినీతో
వాకొనియెదనని భూసురుఁ, డాకృష్ణునితోడవినయ ♦ మడరంబలికెన్. ౧౬౯.

వ. అనిన నప్పరీక్షిన్నరపాలుఁడు శుకమహాయోగిఁ గనుంగొని యవల నడచినవృత్తాంతంబు సవిస్తరంబుగా నానతీయవలయునని యడిగిన. ౧౭౦.

శా. ఆవాసీన్నదరాజరాజరవినే ♦ త్రాంభోజభోజాత్మజా
హావానారతనర్మసద్మహితని ♦ త్యానందనందవ్రజ
స్త్రీవారాసముజ్జాణబాణకరజో ♦ త్సేకాంతకాంతాంగశో
భావిధ్వస్తఘనాఘనాగభృతిబి ♦ భ్యద్గోపగోపాలకా. ౧౭౧.

మాలిని. పరమపదనివాసా ♦ బంధురశ్రీనివాసా
సరసమృదులహాసా ♦ శత్రుహృచ్ఛంద్రహాసా
భరితకనకచేలా ♦ భవ్యశృంగారలీలా
విరచితనుతిలోలా ♦ వేదవిద్యాలవాలా. ౧౭౨.

గద్యము. ఇది శ్రీమదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణప్రాప్తచతురతరసాహితీవైభవ చక్రపాణ్యమాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మార్గణవిశ్రాణితమహాఫల కోవిదనుతభాగధేయ కోటీశ్వరనామధేయప్రణీతంబైన భోజకన్యాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.



క. శ్రీశుచిరయోగయోగ్య, ప్రారబ్ధదివ్యబోధ ♦ పరిపాలితమౌ
దారూఢగుణవిశారద, నారదనుతగుణవిహార ♦ నందకుమారా. ౧.

వ. అవధరింపుము పరీక్షిన్నృపాలునకు శుకయోగి యిట్లనియె. అట్లు భూదేవుండు
గోపాలదేవునితోడ నిట్లని విన్నవింపం దొడంగె. ౨.

సీ. వినవయ్య కృష్ణప్ప ♦ ధీవసాధ్వీలోకదివ్య, మండనంబన నొప్పఁ ♦ గుండినంబు
తత్పురంబును ధర్మ ♦ తత్పరస్థితి నేలు, మదవదరాతిస ♦ మాజహృదయు
భీష్ముఁడై తనరారు ♦ భీష్ముఁడాతనిసూను, లసమానులేవుర ♦ త్యధికబలులు
వారికందఱకును ♦ గారాబుఁజెల్లెలై, యలరారురుక్మిణి ♦ యనెడుకన్న
రుక్మి మొదలగునన్నలా ♦ రూఢమమత, నాటలను నేర్పనెంతయు ♦ నందమొలుకు
నంచకోదమయనంగన ♦ చ్చంచలాక్షి, యలరుజనకమానసముల్ల ♦ సిల్లెడునటుల.

మ. అలభోజేంద్రుఁడు దాహజారమునఁగో ♦ లైవ్రయుండినా నానరేం
ద్రులఁజేజేయని మ్రొక్కఁ హెచ్చియును నెం ♦ తో కూర్చునక్కూఁతుపైఁ
గలప్రేమంబున సోదల్లులను సై ♦ గంబంచి తెప్పించిము
ద్దుఁగగ్గొంటయె కానిచూడఁడలనా ♦ ధుల్మోళ్కుఁటొక్కంతయు౯. ౪.

తే. సకలరాజన్యమూర్ధన్య ♦ సమితిదన్ను, సంకములఁజేర్చిము ♦ ద్దాడుచుండ
నలువుదళుకొత్తబాలవి ♦ ణారవంబు, లొలయనల్లారుముద్దుగఁ ♦ బలుకుచుండు. ౫.

క. మెఱుఁగు౯ వెన్నెలచిన్నెల, చిఱునగవులసకలరాజ ♦ శేఖరులుదను౯
శిరమునవహింపఁగన్నియ, కరమలరు౯ జందమామ ♦ కళయునుబోలె౯. ౬.

తే. ఆటప్రాయంబురానంత ♦ నలకుమారి, కనుఁగుఁజెలులుఁగఁదలిదండ్రు ♦ లలవరించి
రబ్జరేఖచకోరాక్షి ♦ యంబుజాస్య, లలితరసమంజరియనంగ ♦ వెలయుచెలుల. ౭.

క. ఆచిన్నిప్రాయమప్పడు, చూచినవారలనుమఱలి ♦ చూడఁగఁజేయు౯
మైచక్కఁదనముచేమృగ, లోచనధవళారవింద ♦ లోచనవింటే. ౮.

వ. ఇవ్విధంబున నయ్యండజగమన కొండికప్రాయంబు నంద పుండరీకకోదండుని మండలాగ్రంబు తెఱంగున మెఱుంగులు గల యంగవల్లీసముల్లసనంబునఁ బొసఁగియును, ధాత్రీజనసతతసంవర్ధమాన యై యబ్జరేఖాప్రముఖసఖీజనంబులతో డిలీలావినోదంబులం

దవిలి మచ్చికలు నెఱచ్చ నచ్చనగండ్లు వెన్నెలకుప్పలు గుజ్జనగూళ్లు తుంపెసలుం డాఁగిలిమూఁత లిట్టికలు సింగనావత్తి గుజగుజరేకులు చింతపూవులు చిట్లపొట్టలును గుమగుమగుంచంబులు వామనగుంటలు నట్టింట మొదలుగాఁగల యాటలం దవిలి క్రీడింపట్టునఁ గూడును నిదురపట్టున నిదురయు నెఱుంగక తరంగితహర్షాతిశయంబున మెలంగుచుండునవసరంబున. ౯.

తే. కలికిలతకూనకు వసంత ♦ కాలసనంబు, తళుకుఁ క్రొత్తమ్మివిరికినె ♦ త్రాశిశివి
కలిగిరహిమీఱఁగాఁ జేయు ♦ కరణి శరుణి, చిన్ని నెమ్మేను పాయంబు ♦ చికిలిచేసె.

క. అళికచకచనిచయ శ్రీ, విలసనమంబుధరమును ము ♦ వివరింపనగుఁ
దళుకుగల మొగలి రేకుల, తోలుకారు నైఱుఁగులచటఁ ♦ దోఁచుటకతనన్. ౧౧.

స్రగ్ధర. వదనాంచద్భృంగభార ♦ స్వహృదయవిలస ♦ త్స్వోర్వశీత్వంబులుండన్
మదిఁదాఁ బాటింపకర్థిన్ ♦ మధురిపుగృహిణీ ♦ మానితాంశూద్భవశ్రీన్
దదభిఖ్యం జెందు చక్షు ♦ స్సరణకమలరు ♦ స్మగ్వమాత్వంబునొందెన్
దదభీష్టాప్తిన్ బ్రధానో ♦ న్నయనమనుగతి ♦ న్మధ్యమాసుప్రసిద్ధిన్. ౧౨.

మ. అలరుంబోఁడిముఖారవిందమహనీ ♦ యామోదవాంఛాప్తిచే
నలిసంఘంబులు వ్రాలిగంధఫలిచా ♦ యన్ మించునాసారుచిం
గలఁగంబాఱియుదూరమేగకయుఁ త ♦ ద్గంధాతిలుబ్ధంబులై
నిలిచెన్ బైనననొప్పుఫాలవిచల ♦ న్నీలాలకల్ చానకున్. ౧౩.

శా. నారీప్రేక్షణకాంతికోటతియుగుల్ ♦ నాళీకముల్ తోడుగాఁ
గోరన్ గెల్వఁగనీనికాద్యుతికినై ♦ కొంకేలమీ కారుచిన్
మీఱన్నేమనికోరఁ జేరివలగా ♦ మిన్ విచ్చిపోఁదమ్మిక
స్తూరీచిత్రకరేఖవక్త్రిమునని ♦ ల్చున్ బొల్చుఁదత్ప్రితికిన్. ౧౪.

శా. ఆవాగ్భర్త చెలిన్ సృజించుతటిస ♦ ర్వాంగీణసౌందర్యభా
శ్రీవిస్ఫూర్తియుసర్వభూపలలనా ♦ సేవ్యత్వసౌభాగ్యకృ
చ్ఛ్రీవిస్తారముగల్గవర్ణములునీ ♦ రేజాక్షి ఫాలస్థలిన్
శ్రీవర్ణద్వయసంపుటంబుగను వ్రా ♦ సెన్నాఁ దగున్ గర్ణముల్. ౧౫.

చ. అలికులవేణి భ్రూయుగళి ♦ మన్ ధనువుల్వరకజ్జలప్రభా
విలసితపక్ష్మమాలికలు ♦ వేగసమర్చిమరుండు చూడ్కులన్
గలువలకోరులన్ దొడిగి ♦ గాఢవికర్షమొనర్చిలక్ష్యమం
దలవడు దాఁకనాచెనన ♦ నందుఁ ద్రపానతదృష్టులొప్పెడిన్. ౧౬.

తే. చెలి యకుందమ్ములందమ్ముఁ ◆ జెందఁగోరి, మీనసంతతులెంతేని ◆ మెలఁపు తోడ
నీటఁ దపమాచరింపఁగ ◆ నాఁటఁ గోలె, నవనిరాజీవసంజ్ఞల ◆ నవిభజించు. ౧౭.

తే. మగువ కనుదోయియౌవన ◆ మదము పేర్మి, శ్రవణబిలములఁ బడుననుశంకనలిన
భవుఁడు నిగళంబులుంచిన ◆ భాతిఁ గజ్జ, లాంగకతఁ బక్ష్మరేఖలు ◆ నలరు మిగుల. ౧౮.

చ. దళములు గూర్చి గంధఫలి ◆ తామరసాయతనేత్ర నాసికన్
గెలువఁగ వచ్చితద్రుచికిఁ ◆ గీడ్పడి లజ్జఁ దొలంగి కానన
మ్ములమలుఁ గోటనాభ్రమర ◆ ముల్ పువులన్నియుఁ జెందు వేఁకచే
నలరియుఁ జంపకంబనన ◆ నాదరవృత్తి మెలంగు నిప్పుడున్. ౧౯.

ఉ. మీనత సారసత్వమున ◆ మించినదే దనిలోచనద్వయం
బానిసమీకభూరిగతి ◆ నాప్తివిపర్యయదీర్ఘసత్వమై
మానుగ నక్షరస్వపట ◆ మన్నిజమధ్యమునందు నుంచఁగా
దానఁ జెలంగె నానద్రుమ ◆ దామణికిన్ భువనప్రసిద్ధమై. ౨౦.

సీ. కల్కిచిల్కలకొల్కి ◆ గావునఁ గెమ్మోవి, పక్వబింబమటంచుఁ ◆ బలుకరాదు
వికచోత్పలేక్షణ ◆ పికవాణి గావున, నధరంబు చివురంచు ◆ నాడరాదు
కామిని జలదాభ ◆ కచగాన నోష్ఠంబు, పద్మరాగమటంచుఁ ◆ బలుకరాదు
కలకంఠి కమలాస్య ◆ గానరదచ్ఛదం, బలమధురసపూర ◆ మనఁగరాదు
వనితనెమ్మోము సారలా ◆ వణ్యవిభవ, జలధినుదయించు సంపూర్ణ ◆ చంద్రుఁడగుటఁ
దద్గతామలనవసుధా ◆ ధారలుండు, దీవియనవచ్చుఁ దొయ్యలి ◆ తియ్యమోవి. ౨౧.

తే. రమణి రమణీయయౌవనా ◆ రంభజాత, సారసాకూతదరహాస ◆ చంద్రికాంకు
రములచాలనఁ జెలువొందు ◆ విమలదీప్త, దళితకుందకోరకకాంతి ◆ దంతపఙ్క్తి. ౨౨.

మ. చెలియాస్యద్యుతిఁ జెందఁగోరి శశిరా ◆ జీవంబులెంతేవన
స్థలి నిచ్చల్ తపమాచరింపనిజమి ◆ త్రస్నేహసంపన్నతన్
జలజంబందెఁ దదాత్మతన్విధుఁడజ ◆ స్రంబుం గళంకాప్తిఁ ద
త్ఫలమొందంగనఁ డయ్యెఁ గాననదిప్రా ◆ తస్వైరమూలంబిలన్. ౨౩.

తే. చెలియవక్త్రాంబుజంబును ◆ శీతభాను, బింబమును ద్రాసులో నుంచి ◆ శంబరారి
తూఁపలాఘవమునఁ గదా ◆ తోయజారి, పాడవునకుఁ జేరె మిగులన ◆ ద్భుతముదోఁప.

మ. జనభీతిప్రదఘోషపంకజనన ◆ స్వారాయశఃప్రాప్తిప్రౌ
పనరాశిం దపమొందిశంఖముకల ◆ స్వానామృతౌఘంబుసో

ఘనరేఖాత్రయభాసురంబునయిత ◆ ద్భామాగళత్వంబునొం
దినముక్తావళితద్భవత్వమునఁజెం ◆ దెన్ హారనామాకృతిన్. ౨౫.

తే. వనితబాహుయుగముకల్ప ◆ వల్లులగుట, తథ్యమనియెన్నఁబోలును ◆ దారలీల
నంగుళులుకిసలంబులే ◆ యనఁగవచ్చు, నరుణనఖకోరకంబుల ◆ నలరుకతన. ౨౬.

తే. భీతమృగనేత్రబాహువుల్ ◆ బిసములగుట, కొకరినడుగంగవలయునే ◆ ప్రకటమగుచుఁ
బాణియుగ్మకనవశోణ ◆ పంకజంబు, లరిదినటఁదోఁచుచుండుటె ◆ గుఱుతుగాదె.

తే. మగువయంగంబులెల్లను ◆ దగస్మృజించి, యంతఁదప్పొప్పుచూచువో ◆ నబ్జభవుఁడు
దబ్బసైతోఁచుచున్నమ ◆ ధ్యంబునందు, బుజయిడినచందముననాభి ◆ పొలుచుమిగుల.

క. జలదరుచివేణినడుమం, జెలువొందఁగఁబిఱుఁదుదనరు ◆ సీమంతినికిన్
జలదాత్యయమునయమునా, జలధారందగుతదీయ ◆ సైకతమనఁగన్. ౨౯.

ఉ. కానకగాత్రనున్దొడల ◆ కాంతికినోడియనంటులంతటం
గాననభూమిలోనణఁగి ◆ కైతవవృత్తినిసర్గతత్ప్రభా
నూనవిలాసముంగొనఁగ ◆ నొక్కటదొంగలనంతరించియున్
దానసుజెందలేకయటఁ ◆ దద్దయువాంచుశిరంబులజ్జచేన్. ౩౦.

చ. దళములువెంచికంజములు ◆ తామరసాక్షిపదద్వయంబుతోఁ
జలమునఁబోరవచ్చిరుచి ◆ సంపదసాలమిచేసహస్రధా
దళితములౌటనోచివురు ◆ తండమునూపురపద్మరాగభా
విలసనకైతవంబులను ◆ వేమఱుఁజేరిభజించుచుండుటల్. ౩౧.

తే. చెలియప్రపదంబుఁజూచిల ◆ జ్జించికచ్ఛ, పంబుదనతలఁబొట్టలో ◆ పలనెయుంచు
నంతఁబోకవిరక్తిచే ◆ నవనినెగడుఁ, గమఠమననెందుఁదానరి ◆ గాఁడనంగ. ౩౨.

మ. మొగమాచందురుఁగేరుఁగెంపులనగున్ ◆ మోవద్దపుంబిల్లలం
దిగడుంజెక్కులుచంచలాళిగెలుచున్ ◆ దేహంబునబ్జంబులన్
నగుఁబాణుల్ కనకప్రసూనకళికల్ ◆ నాసారుచుల్ వ్రేళ్లహో
చిగురుల్ మీఱెడునెంచఁగావనమెయా ◆ సీమంతినీరత్నమున్. ౩౩.

సీ. పద్మాక్షివేణితోఁ ◆ బాణితోనెనరావు, కందముల్ కనకార ◆ విందములును
దనుమధ్యమోవితోఁ ◆ దావితోసరిరావు, బింబముల్ నూనక ◆ దంబములును
నుదతిపల్కుద్గురుతో ◆ నుదురుతోఁదులరావు, కుందముల్ శశిరేఖ ◆ చందములును
చంద్రాస్యయూరుతో ◆ సారుతోదొరరావు, నీలముల్ చంచలా ◆ జాలములును

